గేయం॥ ధ్యానమనుకొల్మినీగానమనుమేల్మినిడిదానిపయిఁదాల్మిమెయి
నూహాల౯ । సాన రుచలీనఁగాసూనములుగా ద్విజవితానములుఁగా
మృగవిధానముల్ । గా నతులవీజనల్గా నెనయ మల్చికళలీను సొగ
సైనపెనుహారమున్ । బూనికనొనర్తు నింపౌనె? ధరియించెదె?
యనూనదయజూపుపస మాధవా!॥ 89

చ॥ లలిఁగొని చూపుమేర కవలంగలవానినె చూడలేను భూ
స్థలి నిఁక విశ్వరూపునినుఁ జక్కఁగఁ గన్గొననౌనె? తోలుచూ
పుల ననుమాటలే కెపుడుఁబోరుదుఁ చూపుము నీదురూపటం
చలవికిమీరునాశ నపహాస్యుఁడనయ్యెదఁ జూడు మాధవా! 90

చ॥ ముకురములోనికొండఁ దనమూపునకెత్తుమటంచుఁ బోరుబా
లకువలెఁ గొంచెపు౯ జగముల౯ ప్రతిబింబితమా భవద్విరా
డ్వికటతరోరురూపమును బట్టయతించెడునాదుమూర్ఖవ
ర్తకమునకు౯ హసింతువె? నిరంజనభాస్వదభిజ్ఞ! మాధవా!॥ 91

శా॥ నీలావణ్యము చిత్తమోహకముగా నిండై నభోవీధి నా
లోలచ్చిత్రకళామణిప్రభ సమాలోక్యార్క్ష సన్నాహాసు
శ్రీలన్ నిత్యము విందొనర్ప మఱివేరే? విశ్వరూపంబు? మా
యాలీలన్ భ్రమఁగొంటెగాక బహురమ్యావిష్క్రియా! మాధవా!

మ॥ బహురమ్యాకృతులన్ మనోహరబహుధ్వానప్రసక్తిన్, శ్రమా
పహమందానిలపాళి రుచ్యబహుసద్వస్తుక్రమాళిన్, ముహు
ర్ముహురానందమొసంగు సేవనల మమ్మున్నిత్యమున్ సాకునీ
కహహా! మేమొకసేవఁ జేయఁగలమయ్యా! పూనినన్ మాధవా!॥ 93

ఉ॥ చేఁపినపాలు బిడ్డకిడి చెందు సుఖంబును మాత; నీవున
ట్లే పలురీతులన్ మమతలెక్కొన మాకొనరించుసేవలన్
గైకొనరించు సమ్ముదముఁ గాంతువుగాక, సుఖంబు నీకునీ
నోపినసేవఁజేయఁగల యొద్దిక మాకడనున్నె? మాధవా!॥ 94

మ॥ కరతాళంబులుఁ గంఠగానములు నాల్కన్ గైతలున్ గాళ్ళనృ
త్యరవోద్రేకముఁ గండ్లనిశ్చలితమోగాసక్తమౌ చూపు మేన్
గరి సర్వోన్ముఖవృత్తిఁ జిత్తము నినున్ గాంక్షించుచో నైనసం
బరమున్ నీవును గొంతఁగైకొనఁగరమ్మా! మేలగున్ మాధవా!॥ 95

మ॥ ఎపుడీహృత్పుటి నీదుచింతనము జేకెత్తున్ మహానందమై
యపుడే దివ్యకళాఢ్యమౌదివము తద్వ్యాపారముల్ సున్నలై
నపుడే దట్టపుఁగారుచీఁకటి వికారాదుల్ హృదిన్ మూఁగు టీ
విపరీతంబులఁ గ్రాఁగలేను హృదినీవే నిల్పవే! మాధవా! ॥ 96

చ॥ క్షణికళతాంశకాలమును సన్నిధితప్పినయే స్తధాంధణం
ధణయను ప్రమోతలన్ బహువిధంబులఁ జుట్టునుమూఁగి లౌక్యదు
ర్గుణములు పెన్నుడుల్ నెఱపి గోడునముంచ యతించు తన్నివా
రణ మతికష్టసాధ్యమగు రమ్మిట నాదుకొనంగ! మాధవా! ॥ 97

మ॥ ఉదయంబౌరవియుగ్రదీప్తులకె పాయున్ గారుచీఁకట్లు నా
మది నీనీడ యొకింతసోక నటులే మచ్చైనలేకుండ దు
ర్మదముఖ్యంబు లడంగినాశనమగున్ రాత్రిందివద్వంద్వకా
పద లేకుండ సతంబు నీస్మరణమున్ బ్రాపీఁగదే మాధవా! ॥ 98

మ॥ అదె దీప్తాకృతు లాకసంబున సహస్రానేకముల్ గుంపులై
యుదయాస్తంగతిలేనిదీప్తులఁ ద్వదీయోపాసనానందసం
పద నృత్యంబునొనర్చు పెంపు లెదుటన్ వర్తిల్లుఁగన్మూసినన్
సదయా! కన్నులవిప్పునం దదియొకాంచన్ జేయవే! మాధవా! ॥ 99

శా॥ జ్యోతిర్గోళశతంబు లాకసమునన్ జొత్తెంచి రిప్రవిప్పనన్
జేతోమోదముగాఁ జరించి తమకంబెన్ గోటిరెట్లెక్కుడౌ
నీతత్వప్రభలోనఁ జేరుటలు కంటిన్ నామనోవీధి నా
రీతిన్ నన్నునుఁ జేర్చుకోఁగదవె తండ్రీ! నీమెయిన్ మాధవా!॥100

ద్రు॥ వి॥ మధురవీక్షణమండితపావకా! మధురవిగ్రహమానితభూకళా
మధురకార్యసమర్పితమానసా! మధురభక్తిసుమప్రియ! మాధవా!॥

ద్రు॥ వి॥ కరుణ నీకడకన్నుల జారఁగా వరసుధారసవర్షము లోకమున్
బరమసౌఖ్యశుభస్థితి నిల్పెడున్ దరరథాంగగదాధర! మాధవా! ॥

ఉత్సాహ॥ స్వామి యెందు జడతలేనిభక్తి సంతతంబు నీ
నామకీర్తనమునుబాని నాదునిత్యసద్విధిన్
నీమహెుప్ప నసదుమాని నెగ్గఁగల్గు ధార్ఢ్యమున్
బూమెలన్ని యెఱుఁగఁజాలు బుద్ధినీవె! మాధవా! ॥ 103

పృధ్వి॥ అమూల్యమగు నీ కృపామయకటాక్షరోచిర్గతిన్
భ్రమాముఖహిమప్రపంచకవిపాటనం బబ్బుటన్
శమాదిసుగుణాఢ్యులై మును లెసంగి రుద్యత్ప్రభన్
నమోనమ! తరింపఁజేయుమి! యినప్రభా! మాధవా! ॥ 104

చ॥ భువననిదాన! దానవవిభుక్రధన త్వరమానమానసో
త్సవబహుమానమానితవిధానవధానకళాభిమాన! మా
నవపరిమాణమానగణనక్రమదూరగుణాసమాన! మా
నవనవభక్తిసారకలనన్ గనమానకుమయ్య! మాధవా! ॥ 105

చ॥ విని కొనియాడి పాడి సరవిన్ విరివిన్ గని పెంచి మించు సే
వనమునఁ గూడిమాడి తెగువన్ బగవర్తిలి మున్ను సన్నవా
ర్లను ఘనధీనిదానమొనరన్ దనరించుట విన్కిఁ బూన్కి నా
మనమున నిన్నె యెన్న నను మానము మానితినయ్య! మాధవా!॥

ఉ॥ పావనమైననీకృపకుఁ బాత్రుఁడనౌటకుఁ జేయఁదగ్గవే
వోవిధులున్నవంచు మనువు ల్విబుధుల్వచియింత్రు వానిచే
భావము నీపయిన్ నిలుచుభంగి పొసఁగుట లేదు నాకు రా
వే వినవే మొఱన్! బలుకవే తగుభక్తిపథంబు మాధవా! ॥ 107

ఉ॥ అబ్బురమయ్య! బీజమెదియైనను దద్గతవస్తువృద్ధికిన్
నిబ్బరమైనసూటి ధరణిన్ దగుసారమొసంగుచుంట, ని
ట్లుబ్బ నొసంగుసృష్టి సమయోచితభోజ్యముగాఁగ నిల్పునీ
ప్రబ్బుదయావిశాలతకుఁ బ్రాంజలిఁజేసెదనయ్య! మాధవా! ॥ 108

---

# మాధవ శతక కదంబము.

## ద్వితీయోపాయనము.


సుఖరాజ్యభోగరస శేముషులన్ వెగటొంపులేక నిం
డై సకలేప్సితప్రదములై యమృతాంబులఁ జిల్కు నీజగ
న్న్యాసవిలాస మెంతకనిన న్గనువిం దొనఁగూర్చుఁగానఁ గం
డ్రీ! సముదీర్ణవృత్తిఁ బ్రకటించెదఁ దత్కథ లిందు మాధవా!

ఉ॥ దుష్టులొనర్చుపీడలను దోలి సమస్తజగంబు శాంతమై
తుష్టి సుఖంబు నొందఁ దమదోర్బలధీబలశక్తిఁ గీర్తి ను
త్కృష్టతఁగాంచి మున్ జనినధీరులు నీయవతారమూర్తులే
స్పష్టమటంచు నమ్మి యిటఁబాడెదఁ దత్కథలెల్ల మాధవా! 2

ఉ॥ చీకటియుంటనే వెలుఁగు చెందెడు మిక్కిలిశోభ చేదు మున్
సోఁకుటచేతనే పెఱరుచుల్ కడుఁగమ్మఁదనంబుఁ గాంచు ట
ట్లే కుటిలాత్ములన్ సుజనలీలలు విస్తృతకీర్తినొందు నీ
యాకృతులేసు మీఁద్వితయమంచు గణించెద నిందు మాధవా! 3

ఉ॥ మాలికలన్ హసించు కృతమాలికనాఁదగు నేఁటిలోన మేల్
చాలికలై జగంబుసడి చాలఁగనంచును స్వేచ్ఛ వింతలౌ
తూలికలంబుభంగగతిఁ దూలికలంగఁగఁ గాలదేవతా
జాలములై యనేకఖగజాలము లీదుచునుండె మాధవా! 4

మ॥ అట గంగాతటసీమ శ్రీమహితయోగాభ్యాసనిర్వాసితో
త్కటనాదార్భటి మించి చంచలబహిర్ధ్యానంబులన్ ముంచి ప్ర
స్ఫుటదానందరసంబుఁ జిల్కుఘనచిన్ముద్రాసమున్నిద్రుఁడై
జటివర్యుం డొకఁ డుండుఁ దద్గతమనస్సంతోషియై మాధవా! 5

శా॥ సారంగంబోకఁ డాకమండలువులో సారంబులన్ గ్రోలఁగా
సారంగంబులు మూఁగి ఝంకృతిఁ గళాసారంబు రూపింపఁగా
సారంగంబులు డాఁగి జూటమున సంసారంబు సాగింపఁగా
సారంగుం డెఱుఁగండు యోగి తమసాసారంబునన్ మాధవా! 6

మ॥ అటు సత్యవ్రతనాముఁడై వెలయు పుణ్యాత్ముండు నిత్యంబు సం
కటసంహారు కృపామృతాంచితకటాక్షప్రాభవోదారు నె
న్నై కార్యంబుగనుండి యోగహితసంతోషంబు పెంపార నా
తటినీతీరమునందుఁ దానపరసంధ్యన్ వార్చుచో మాధవా! 7

ఉ॥ ఆజపశీలి సాంఖ్యసమయార్థవిధు ల్వచరించుచుండ నీ
రేజము లంతలో మొగిడెఁ బ్రీతిఁ దలిర్పఁగ సాగెఁ గల్వ లా
భోజహితుండు హస్తగిరిమూఁపుదెస న్దిగుచుండె మింట వి
భ్రాజితమయ్యె మోహనజపాకుసుమారుణకాంతి మాధవా! 8

ఉ॥ సారససీమలందు మధుసారసమాదృతిఁ జొక్కి మోడ్పుచే
కూరుట సందుఁ జిక్కి పలుకూరటలన్ వెలిపోకఁ దక్కి ఝం
కారత నిక్కుషట్పదవికారరవంబులు శైవపాఠ ని
స్సారితపంక్తికంఠగళచారిని నాదము లయ్యె మాధవా! 9

ఉ॥ పెద్దదియౌదివాకరుని బింబములో సగపాలు క్రుంకె మే
ల్బుద్ధి మునీంద్రుఁ డర్ఘ్యమిడుపూన్కిని దోసిటనీటి నెత్తి య
ట్లద్దెసఁ బోయఁబోన మనుజార్తవచస్సుల నందునుండి యా
పద్దశ "రక్ష! రక్ష!" యనువాక్కతిదీనతఁ దోఁచె మాధవా! 10

ఉ॥ దోయిలిపోబడిన్ మిగులఁదొందరతోడుతనాఁగి డింపి "స్వా
మీ! యిదియేరివాక్య"మని యేర్పడు వింతగగుర్పుమాటగా
నాయతి పల్కి చూచుకొన నం దొకబిత్తరిచిన్నలేతమీ
"నో యమివర్య! పాహి!" యని యూర్ధ్వముఖంబయి పల్కె మాధవా!

ఉ॥ "ఎట్టిభయంబుసోఁకె? నిను నేగతిఁగాచుట నీదుకోర్కి? యిం
పుట్టిపడన్ హొరంగుమెయి నున్నమనోజ్ఞవు నీకు నొక్కయి
క్కట్టును దోఁచెనే? పసినిగారపుకూనవు నీవు తొట్రిలన్
బుట్టినయాపదన్ దెలుపు ప్రోతు" ననెన్ జడదారి మాధవా! 12

చ॥ అనవిని మేన్నెఱుంగు చలనాప్తిఁ దళుక్కులనీన, మోడమె
చ్చినమది "నేమినేమనవిఁజేసెదనయ్య! జలంబులందుఁబు
ట్టినమొద లింతదాఁక నొకటేదినగండము కాదుకా దను
క్షణమును గండమయ్యె" నని జాలి వచించెను మీను మాధవా!

చ॥ పగిలినగ్రుడ్డనుండి వెలిఁబడ్డసహోదరులేను వేలువే
లుగఁ, బురిగట్టి తోరణములోయన, మిన్కులచాల్పునాఁగ నొ
త్తగునవరత్నసంఘటితదామములోయనఁగాఁ బ్రవాహగ
తిగ జలగర్భసీమలను దిర్గితిమంచనెమీను మాధవా! 14

మ॥ కడుసూక్ష్మంబులుమేనులౌట, మది నాఁగాము ల్వివక్షించుచో
ప్పెడయాట, స్దమిఁ దాఁకుతప్పుటలు సుంతేనెన్నఁగాలేక యే
ర్పడుకౌతూహల ముబ్బఁజేయ బురదన్ బాచిన్ శిలాగ్రంబుల
న్వెడపర్యాప్తనితిమంచుఁ బల్కె ఝష మవ్వేదాంతితో మాధవా!

చ॥ ఒకరమ లేకయిద్దరమ? యుంటిమివేలకువేలు, స్వేచ్ఛను
త్సుకతఁజరించుచోట మముఁజుట్టి గ్రసించెడుపెద్దమీలు నే
రకములతాలొ నాచులొకొ రమ్మని తత్పరితః ప్రసారతన్
వెకలులమై చరించితిమి వేడుకనంచనెమీను మాధవా! 16

ఉ॥ భూరిఝషంబు లుర్విడిని బోయెడుత్రోపుడుఁ బాటనెట్ట నా
దారి ననేకము ల్వివశతన్ విపృత్యాసములంచుజారి యా
హారములయ్యె వానికి, జలాగ్రతలంబుల సంచరింపఁగాఁ
గోర విహంగబాధ వెలుఁగొల్పెనటన్ జలగామి మాధవా! 17

ఉ॥ పైకెగురన్విహంగములబాధ జలాంతరకర్దమస్థలిన్
గైకొనఁ బెద్దమీల్మొసలికాటులుఁ దప్పవు, తీరసీమలన్
బ్రాకఁగ జాలరుల్ దటిమిపట్టుదు రిట్టిచేతఁ బ్రాణము
ల్పోకుట కెన్నినాళ్లొ? యనె, సాధుస కొరఝష మప్డు మాధవా!

చ॥ "తలఁచుకొనంగ నాకడుపు తద్దయు వ్రయ్యఁగఁబడ్డయట్లుతె
కలఁగుమనంబు నోటఁడడికన్పడ డంగిలిమూరు మేను మూ
ర్ఛల వివశత్వమూను ఋషిసత్తమ! యేమనివిన్నవింతు నా
బలగముగాథ!" యంచనియె వాలుగ తేఁగినచింత మాధవా!

ఉ॥ "వేలకొలందియట్లు ప్రభవించినమత్స్యసమాజమ్ములందఱుఁ
జాలరిచేత భూరిజలజంతుకదంబముచే విహంగమా
ళీలతచే భుజంగకులభీకరవృత్తి నడంగిరయ్యె! నా
చాలున కేన నిల్చి"తనె జాలి నలందురు మీను మాధవా! 20

చ॥ "భయపడ కేను ప్రోతు నను బాంధవు లెవ్వరు లేరు కన్నడన్
రయమున మ్రింగఁజూచు పెనురక్కసితండమె కాని, నేటికో
నియమవరా! యదృష్టగతి నీపెను ప్రాపు లభించెఁ, గొన్ని నా
ళ్లయినను నిర్భయాత్మఁ దగినాఁడ"ని నేఁ జలుచేప మాధవా! 21

ఉ॥ "పూనిక వెంటఁ బాఱి పెనుభూతమసందగు పెద్దచేప యెం
తేనలయింప నేఁడు కడతేఱెభవం బనుకొంటి నీదయన్
బ్రాణములన్నియున్ గుదుటఁబడ్డవి తల్లివితండ్రివైన నీ
వే ననుఁ బ్రోయఁ బోక భరియింపవె?" యంచనె మీను మాధవా!

ఉ॥ "నీకనులన్ గృపామృతము నింపుగఁ దోణ్కసలాడుచుంట యె
ప్డాకరుణార్ద్రదృష్టి సమయజ్ఞత నాపయిఁ బాఱె నప్డె నా
సోఁకినబాములన్నియును సుక్కుటుగాక మనంబు మేను దీ
ప్తాకృతులయ్యె నా"కనియె నాచిఱుబేడిసపిల్ల మాధవా! 23

మ॥ భవదీక్షాబలజాతనూత్నలలితప్రజ్ఞాఢ్యమై నాదుబు
ద్ధివిశేషంబు విలక్షణప్రభల సంధింపంగ నాకీయపూ
ర్వవచోవైభవము ల్లభించె, నిఁక ధైర్యంబబ్బె నో సంయమీం
ద్ర! వదాన్యోత్తమ!" యంచు సన్నతిగ నంతన్ బ్రాలె మీనాధవా!

ఉ॥ క్రమ్మఱలేచి "యల్లదె ముఖమ్ము దెసన్ శరణాగతావనా
ఢ్యమ్మగుక్షాత్రతేజము దయాకలితార్ద్రగుణంబు సందులన్
ముమ్మరమై వెలింగెడు నమో! నమ! రక్షణదక్షమైన ప్రా
పిమ్మెయిఁ బ్రాప్తమయ్యె నిఁక నేగెభయం"బనె మీను మాధవా!

ఉ॥ లౌకికచింత వీడఁ దగులం బిటఁ గ్రమ్మఱ సోఁకె నంచుఁ జీ
కాకుఁ గొసంగఁబోయెదవొ? కాదది నీసహజం బెఱింగితిన్
నాకున్ను నీకు ధాత్ర్రచనన్ సమకూరె సహానుభూతి నీ
సోకల క్రంతరాయ మనఁబోకు"మనెన్ ఝషమమ్ము మాధవా! 26

ఉ॥ ఆకృతిసొంపుఁజూచి సమయజ్ఞవచోవినయంబు నెంచి చి
త్రాకృతి నంతకంతకు మహాద్భుత మాత్మనెసంగ నిల్చి "య
ప్రాకృతమత్స్యరాజ ఋది, వచ్చె నిటుల్ ననుఁగన్నతండ్రి న
న్నీకరణిం గృతార్థత భరింపఁగ" నంచనిమాని మాధవా! 27

ఉ॥ నెట్టన గట్టిభక్తి నెద నీకునమస్కృతిఁజేసి, మీనుతోఁ
"బుట్టకమున్నె నేర్చితివొ? పుట్టియెనేర్చితొ ముద్దుమాటలం
గట్టఁగఁజాలు పల్కునుడికారము, నిష్టకు నిండుగాదె నీ
యుట్టిరుతోడిపొత్తు ఝషమా!" యనె నాశమశీలి మాధవా! 28

శా॥ అక్షీరోదధి శేషుపాన్పు పయి నొయ్యారంబుఁగా వ్రాలి నీ
కుక్షింగల్గు సమస్తభూతవితతిన్ గోపాయనం బూను నీ
కక్షయ్యంబనుచున్ గమండలువునం దారాడ్నృపీంద్రుండు తా
నిక్షేపించిన నెంతసంతసిలితో నీవాయెడన్ మాధవా! 29

ఉ॥ భక్తిఁ బ్రపత్తి నీదయకుఁ బాత్రుఁడు గాఁదగువాని మించునా
సక్తివహించి యిట్లు సరసంపు విలాసమునన్ గ్రహింతు వో
ముక్తినికేతనా! విషయమోచన! సంశ్రితరక్షణక్రియా
సక్తసుధారసప్రసరచారువిలోచన! శ్రీరమాధవా! 30

ఉ॥ అంతట సాంధ్యకృత్యముల నన్నిటిఁదీర్చి నృపర్షిచంద్రుఁ డా
ప్రాంతమునందె యున్నతనయాశ్రమమున్ దరియంగ నేగు న
ల్లంతనె మీను నీర్పుటిక నంతటనిండి వచించెఁ "దండ్రి! నా
కెంతయొ సంభవించె నిఱుకిందు, వెలార్పవె" యంచు మాధవా॥

చ॥ అదివిని యేమిచోద్యమిది యంగుళియంతది యింతలోన ని
ట్లెసఁగునె? మద్గురుండు జగదీశ్వరదివ్యవిలాస మౌర! నా
హృది ముదముబ్బసాగె" నని హెచ్చిన భక్త్యనురాగజాతగ
ద్గదిక నెలుంగు తొల్పడఁగ దాని వెలార్చి వచించు మాధవా! 32

ఉ॥ మున్నెపు డిట్టివింత కనముర్ వినముర్ ఝషరాజ! నీశరీ
రోన్నతి నాకపూర్వమయియొప్పె, విచారణఁజేసి చూడఁగా
నిన్నొకమీనమాత్రునిగ నిశ్చయమున్ భావింపరాదు గో
రోన్నతిఁగూర్ప వచ్చు భువనోదరమూర్తివిగాని మాధవా! 33

చ॥ అందముగాఁగ నర్ధశశియాకృతులై బహువర్ణకీర్ణదీ
ప్తిం దనరారు మైపొలసుతీరులు బారులుబారులై మెయిన్
గ్రందుగఁ దళుక్కులీన నినుఁ గన్గొనఁ గన్నులఁబండువయ్యెఁ జె
న్నందినచేపమిన్న" యని హస్తములన్ గొనె మౌని మాధవా! 34

ఉ॥ కమ్మనితేటనీట నొడికమ్మగు లోతువెడల్పుపాత్ర మ
త్స్యమ్మిడి తత్ప్రచారముల కద్భుతమందుచుఁ గొంతసేపు కం
దమ్ముల మూసి తావకపదమ్ము లచంచలచిత్తవీథి స్మృ
త్యమ్మునిరింప భవ్యసుఖతానుభవంబున నిల్చి మాధవా! 35

ఉ॥ ముట్టినఁ జిగ్గునో యనెడి ముగ్ధల పల్చని లేఁత తెక్కలి
ట్టట్టుఁజలింప మించిన నొయారపుతీర్గుడుబోక కెంతయున్
బట్టగు తోఁక కుంచెవలెఁ బల్మరునున్ వడుపూనియాడ నే
ర్పట్టిపడన్ జరింతు వహహాఽఝషమా!" యనెమౌని మాధవా!

ఉ॥ దైవమ! నన్నుఁగన్నదొర! తావకచిత్రచరిత్ర లోకసౌ
ఖ్యావహసత్ఫలంబగుట నాగమముల్ వచియించు స్వామి! ము
ఖ్యావసరంబు సన్నిహితమై చనుదేరఁగఁబోలు నిప్పుడీ
వే వసుధన్ జనించుపని కెత్తుటయున్నె మఖాంట మాధవా! 37

చ॥ అనుచు సమగ్రతన్ హృదయమంతయునిండిననీదు విగ్రహం
బునఁ దగులొందియున్నముని మోదుప్పఁగనుల్ వికసింపఁజేయ నెం
దును భవదీయవిగ్రహమెతోఁచె ఝషంబునుపాత్ర, నీరుఁ, దా
ననియెడు లౌక్యచింత సమయన్ జరితార్థుఁడతండు మాధవా! 38

మ॥ భువనాభిన్నవపుర్విలాసములతో భ్రూమధ్యసంసక్తదృ
ష్టివిశేషుండగు యోగిపుంగవునకున్ శ్రీమంతమైవెల్గు నీ
యవినాభావతఁ దెల్పినావుగద ధ్యానాభ్యాససంప్రాపణీ
యవిభాపుంజమ! భక్తిపుష్పమకరందావేశితా! మాధవా! 39

శా॥ ఆనీభక్తుఁడు తన్మయప్రతిభవాఁడై యెంతసే పట్లు నీ
ధ్యానాసక్తనినిల్చెనో యెఱుఁగఁ డంతన్ "దండ్రి! యీపాత్ర నా
కూనంబై మెసలంగనీయదుగదే యోహ్వాని విశ్రాంతి నేఁ
దేనిన్ జూపు" మటన్నమీనుమొఱ కెంతేత్రుళ్లెనన్ మాధవా!

శా॥ ఆదీనోక్తులు తాను కన్గొనెడి దివ్యాకారుఁడే పల్కిన
ట్లై "దేవా! యిదెవచ్చితే' ' ననుచు గాఢాలింగనోద్యుక్తుఁడై
మీఁదన్ గల్గినసీటిపాత్రమును బల్మిన్ గౌగిలించెన్ రసా
న్మాకుల్ కాంతురె భేదబుద్ధిఁ బరమాత్మా! మోక్షదా మాధవా!

చ॥ క్రమముగ విశ్వరూపమును గైకొనియున్నమునీంద్రుదృష్టి సం
యమనమునొందఁ దార్క్ష్యచరుఁడై పరమాత్మ రమావిలాసి నృ
త్యములఁ బురోగతుండయినయట్లుఁ దలంచి యొకింతదృష్టిని
ల్ప మఱలఁ బ్రాకృతప్రతిభ వాఱఁగఁ దేఱె యతండు మాధవా! 42

ఉ॥ ఆయతమైనపాత్రపయి నంతటనిండినమేనితోఁ దను
చ్ఛాయ లపూర్వదీప్తుల దెసల్ వెలింగింపఁగఁ దన్నుఁజూచున
మ్మాయజలేచరంబుఁగని "మామ్మగదే! తడవయ్యె నింకని
న్నేమెడనుంతు దీర్ఘికయిదే తగు"నంచని మౌని మాధవా! 43

ఉ॥ బట్టనుగప్పి పాత్రఁదలపైనిడుకొంచును వాపిఁజేర్చి స
ప్రమాట్టగు లోకమోహను కరంబుమెలంకువమీఱఁదీసి జే
పెట్టెడు స్వస్తివాక్తతుల భృత్యవిధేయత వెల్గ సీటిలో
నెట్టనడింపె మెత్తపయి నిల్పెడులాగున మౌని మాధవా! 44

మ॥ "జనకా! ఆశ్రమసీమ నీశుభకళాసాంగత్యముల్ కొన్నినా
ళ్లనుభూతంబులుగా నెసంగ భవదీయంబైనచిన్మూర్తికిన్
మనఉత్సాహముగాఁగ సేవలొనరింపన్ వచ్చునంచున్ ముదం
బున నుప్పొంగితి నన్నువీడిచనెదేమో యింతలో మాధవా! 45

శా॥ నాకున్ నీకు విధాతృసంకలన బాంధవ్యంబుచేకూరె నం
దోకళ్యాణగుణా! వచించితివి యౌనోయంచు నాసాసలన్
చేకుల్వాఁబ్రమోద మందితిని తండ్రీ! దాని కిట్లింతలో
నే కల్గన్ వలెనే విఘాత మహహా! నీచిత్రముల్ మాధవా! 46

శా॥ అయ్యో! పోయితెనీటిలోపలికి రావా! పైకి నీవింతలో
వెయ్యేళ్లై బుడగల్ జనించెడిని యూరిన్ మున్గినావేమొ నా
కుయ్యిన్ నీవటనాలకించెదవె? యిక్రొత్తెవ్వరోయంచు నీ
కైమ్యెబాధల స్థానికాంబుచరముల్ క్రీఁగొల్పునో మాధవా! 47

ఉ॥ రాజసమున్ దయాగుణము రాజిలు నాముఖసీమనంటి వా
తేజున రక్షణక్షమత దీపితమంటివి చేపకూన! నా
మోజులమోజుదాన! నినుఁబ్రోచుటమాఱుగఁ జేతులార నీ
యోజ నినున్ ద్యజించితి నయో! యెటులుంటివొ లోస మాధవా!

మ॥ బహుకాలంబుగ నిందులోఁ బెఱిగి ప్రాబల్యంబునున్ జేవ స
న్నహనప్రౌఢిమ స్వేచ్ఛతోఁ దిఱుగు మీనంబుల్ నినుంబట్టునో
కుహనారంభములన్ శఠించి సిలుగుల్ గోరంబులుం గూర్చునో
స్పృహలే కిందులదింపినాఁడ నిఁక నాకృత్యంబెటో? మాధవా! 49

ఉ॥ నిప్పులబాణముల్ పఱపి నీరము లింకనొనర్తునన్న నా
యప్పువు నీకసౌఖ్యమది, యయ్యొ! యెఱుంగక బుద్ధిజాడ్యతన్
ముప్పున నిన్నుడింపి యిట ముచ్చటలాడుచునుంటి నెట్టులే
త్రిప్పుల లోఁ శ్రమంపడెదో? దీనతనన్నుఁ దలంతో? మాధవా! 50

చ॥ వలవలెఁ జిక్కమట్లు పెనఁబడ్డలతాదులలోనఁ జిక్కి రా
మెలపు నెఱుంగ కందుల భ్రమించుచునుంటివొ? రాత్రివయ్యెనో
పలికి నదాటునన్ జని యపాయమునొందితొ? మళ్ళ దానియీ
నలఁ జను దేఱ నిమ్ముకనుపట్టమి? యేమొనరింతు? మాధవా! 51

ఉ॥ అంతటివాఁడవీవె శరణంచు మదంతికమందుఁ జేఱ వి
భ్రాంతియొనాక, నమ్మకముపాఱినచిత్తముతోడ నంతయో
యింతయొ సేవగాఁగ రచియింతుసహాయమటంచు నాత్మలో
సంతసమయ్యెఁగాని విరసంబగు గర్వమునొంద మాధవా! 52

ఉ॥ కౌఁగిటిలోని జవ్వని యకారణమాయ నడంగె నోటిలో
నేగు గుమంగుమన్ రుచులనీను పదార్థము జారిపోయెఁ గై
లాఁగఁగనందుచుండినఫలంబుల నేఖగమో హరించె నా
హా! గతియేమి? సర్వపరిహాస్యుఁడనైతిఁగదయ్య మాధవా! 53

ఉ॥ త్రాఁగఁగలేనిపిల్లివలె దైవమ! నాతగు పాలకుండనున్
బాగుగ బోర్లఁ దోసితిని పై నధికంబగు ఱిచ్చపాటుచే
నీగతి దుష్ప్రలాపముల నీగుచునుంటినిశన్, బ్రగల్భముల్
గాఁగఁ దలంపఁబోకు ముదకంబుల నిన్ గనవత్తు మాధవా!" 54

చ॥ అని యొకనిశ్చయంబునకు నాజడదారిమనంబు వచ్చుదాఁ
క నితరచింత సుంత పొడకట్టమి నాతఁ డెఱుంగకుండె నో
డ్డునిలఁబడ్డ మాటయె కదుర్వడి నీరము పొంగిపొంగి కా
ళ్లనెగసి జానుదఘ్నతఁ జెలంగుట నప్పుడెఱింగె మాధవా! 55

చ॥ రవచినుకైన లేదు వెలిరంగమునుండి ప్రవాహమెద్దియున్
గవిసెడుక్రంత కన్పడదు కారణమేమి? జలంబు పొంగి యి
ట్టివిధమునన్ దరంగముల డెప్పరమై తొణుకాడనంచు వె
ల్లివిరియు వింత పూన్కి ముదలింపఁగ నాయతిరాజు మాధవా! 56

చ॥ వడి మొలబంటినీట డిగి బాహులసాచుచు బోర్లపాటుగాఁ
బడుచుఁ దటంబుఁ బాదముల బాగుగఁదన్ని యుసిన్ గ్రహించి పెన్
వడి జలమధ్యసీమకుఁజనన్ దగుపూనిక నీదసాగె న
క్కడమును కేసి లోన నెమకంగఁదలంచి తపస్వి మాధవా! 57

చ॥ కరచరణప్రపాతములఁ గల్గిన సంచలనంబుచేత నా
దటిఁగల భేకమీనతతి దవ్వుగ సంభ్రమమూనిపాఱ విం
తరయముమీఱ నీదుచుఁ జనంజన నీరములోతుతగ్గి స
త్వరమగుపోక సాగమి వితర్కమునన్ మునివాళి మాధవా! 58

ఉ॥ వాపి యగాధవారిపరివర్తితమంచు నెఱుంగుదేను ఱా
ఱాపుల నిట్టసంకులము రావుటచిత్రము దానికంటె నీ
కోపున లోతుతగ్గుట కొకొండును హేతువ తోఁచకుండె నే
నేపగిదిన్ గనంగలనొ యుత్తరి బిత్తరిమీను మాధవా! 59

చ॥ చలమున మాయదారిజలచారమె దేనియుఁ గొత్తమీనురాఁ
గలఁగి ద్రుతప్రచారములఁ గంపముఁగూర్చెనొ నీటి, కిట్టులిం
దుల మెరకౌటకున్ గతముతోఁపదు దీర్ఘికయంతయున్ నిరా
కులమతితోఁ జరించి కనుఁగొందునిజం"బని వాని మాధవా! 60

చ॥ ఎడనెడఁ గాలుసేతులకు నింతటసంతటఁ సోకుమిట్ట యీ
గడఁగనుఁగోదలం పెదనుగల్గుట దానిని జుట్టివచ్చుపో
కడ ముని యీదుచో నది ప్రకంపము నొంది మునింగెలోని క
ష్టపు సుడిగుండముల్ వళులఘోర ప్రచండములయ్యె మాధవా

చ॥ మునిగిన ముక్కుకున్ జలము మ్రోతలతో నడిసీమ కుర్వడిన్
గొని ప్రవహించువేగమునకున్ జటి తట్టుకొనంగ లేమి నం
దున సుడివెంట సారెవఱెఁ దోఁప భ్రమించుచుఁ దానుమున్గె నా
మునుకనె నిస్పృహత్వమును ముంచుకొనన్ హతచేష్టమాధవా! 62

చ॥ పడపడి కొంతసేపటికి ప్రజ్ఞ క్రమంబుగ రాఁ గలంకమా
నెద నిడుమిద్ధమం చెఱుఁగ నేరని యాతనిచిత్తవీధి నే
తుద మొదలున్ బొసంగని దెదో కథ గందరగోళమై పడిం
బడి భ్రమఁ గూర్చె వేకువను వర్తిలుస్వప్నమురీతి మాధవా! 63

ఉ॥ క్రన్నన గన్నులన్ దెఱచి కన్గొన లోకము వస్తుభేదసం
పన్నతఁ దక్కి మంచుతెఱ పాఱినరీతిగఁ దోఁచెఁ బుల్గు లా
సన్నదివాముఖానిలసుజాతముదంబునఁ గూయుకూఁతలున్
జెన్నఱి నామగా జెవులఁ జేరె మునీంద్రున కప్డు మాధవా! 64

ఉ॥ ప్రాణము లైదునున్ గుదుటఁబడ్డకొలంది జటాకలాపముల్
రాణఁదొలంగి చిక్కుగ శిరంబు ముఖం బుర మంసముల్ పరి
త్రాణవిధిన్ బెనంగ మెయి దార్ఢ్యము లేమిఁ గ్రియాప్రభాదరి
ద్రాణతచే నచేతనతఁదాల్చు టెఱింగెనుమౌని మాధవా!॥ 65

మ॥ బలహీనత్వముఁ బాయ నెమ్మదిగఁ సంబాళించుకొంచున్ జటల్
దొలగన్ సర్ది ప్రవర్తితాఖిల మెదన్ దోపంగఁ జుట్టున్ గనుల్
మలయన్ ద్రిప్పి కనుంగొనన్ దెలిసె క్షేమస్థానమై యాయత
స్థలమై నీళులులేనిచోట నటులన్ దానుండుటల్ మాధవా! 66

శా॥ ఔరా! యెంతప్రమాదమయ్యెఁ! దొలిమత్స్యం బెక్కడన్ జిక్కెఁ! గా
సారం బేది? మదాశ్రమం బెచట? నిశ్శక్తిం బడన్ హేతువే
దో? రమ్యాకృతులొప్పు గచ్ఛపయి నెట్లోయున్కి? నా నానిరా
బారిన్ బిట్టు కలంచె యోజన లసంప్రాప్తస్పృహన్ మాధవా! 67

ఉ॥ గచ్చిదికాదు రంగు లొడికంబుగ దిద్దినతోలునాఁ గడున్
ముచ్చట లీనుచున్నయది బుద్ధికి శుష్కముగాక సార్ద్రమై
హెచ్చినచెన్ను మెత్తఁదన మెంతయునున్న నెసంగె నిక్కమౌ!
మచ్ఛమయానొకో? మదముమాదిరి వాసనవచ్చె మాధవా! 68

మ॥ నిజమేపో! పొలసుల్ చతుర్దశశివన్నెల వాసి శాసించు రూ
పుఁజెలంగన్ విరివిన్ మనోహరములై మున్నేఁగనుంగొన్న చి
న్నజలేచారము వృద్ధిఁగొన్నటుల భ్రాంతిన్ గొల్పఁగాసాగె నిం
తజయం బిట్టియదృష్టముర్ గలుగునా? నాకీయెడన్ మాధవా! 69

శా॥ పానీయంబులకో దినాంతపవనవ్యాసక్తినో చేరు దీ
కోనేరేను దినంబు నెప్పుడిటఁగన్గో నిట్టియాశ్చర్యమా
మేనున్ దాలిచి యింతదీర్ఘతరమౌమీనంబు సందేహమే
లా నాటక్కరిసామి నీకళలెకావా మేలుమే ల్మాధవా! 70

ఉ॥ కానిజలేచరంబు కడగండ్లఁగలంచెనో యేమొ? పైకిరా
నీనియనర్థపూర్వి యలయించెనొకో నినుఁ? గన్నుచల్లఁగా
నేనినుఁగ్రమ్మఱన్ దఱిసి నేస్తముపెంపుననేవసేయ లే
నో నను(జెందుప్రాప్త మెటులో? యనునారటమయ్యె మాధవా!71

మ॥ నినునేఁగాంచెదనం చహంకృతిని గోనెర్నీటలంఘించి యా
పెనుగర్వంబు నశింపఁ దుట్టతుది నీవేనన్నుఁగానంగ నీ
యను వై నిల్చితిఁ జెప్పుకోఁదగుర నాయార్తానసత్వంబు నీ
పెనుప్రాపుండినఁగాక మర్త్యులపనుల్ పెంపొందునే?మాధవా! 72

చ॥ నినుఁగనినంత నీరసము నీరసమైచనె నిండుచేవ మే
నున మనమందు నుత్సుకతనుంగలిగించెను తండ్రి యాజ్ఞయే
మి? నననను(గహించుకలిమిన్ సెలవి మ్మొనరించువాఁడ నే
ననుటహుళ్లిక్తి నీవయగుదయ్య! యదార్థమెఱుంగ మాధవా! 73

చ॥ అని తటసీమఁజేరి వినయంబునయంబునుఁ దోఁప మోడ్పుకే
ల్దననుదుటన్ లంగించుకొనితత్పరభక్తిఁ దదేకనిష్ఠుఁడై
కొని ముని వేచియుండఁ బలుకున్ గుహనార్షుమరాజు శర్కరన్
న్నినిచినస్వాదుసత్ఫలము నించురుచుల్ విలసిల్ల మాధవా! 74

మ॥ చవగండంబులఁబాపిఁ నాకిట గడున్ స్వాస్థ్యంబుఁ జేకూర్చినాఁ
డవు సాధూత్తమ! యాచకుండెఱుఁగువాఁడా? దాతసామర్థ్యమున్
సవరింపందగు నింకనొక్కపని కాసారంబు నాయున్కి కీ
డవునా?చూడుముచూడు మంచనియెమత్స్యం బయ్యెడన్ మాధవా!

శా॥ అయ్యో! నిక్కము! యెంతమందమతి! నౌరా! యింతమాత్రంబు నే
నియ్యో యోజనసేయలేనయితి స్వామీ! స్థానసంకోచతన్
డయ్యెంగల్గెనె! త్వద్దయాభ్యసనరూఢంబైనయోగప్రభన్
ముయ్యేటన్ నినుడింతు నాయతమటన్ మోదింతురా! మాధవా! 76

మ॥ “మునిచంద్రా! దురపిల్లఁబోకు మిపు డేఁబోవన్ గదన్ ముఖ్యమా
పనియొండున్నది సప్తమంబగుదినప్రారంభముందెప్పు డెం
దును గన్గొని మహాజలప్రళయ మెంతో క్రూరతన్ రేఁగు నీ
కను వౌనావయొకండు వచ్చు”నని మత్స్యంబేగనో మాధవా! 77

చ॥ అని చనుచున్నమత్స్యమునయందె తగుల్కొనియున్నచూడ్కి న
మ్మునికి తిరస్కృహాల్ సనియె ముం దిఁకనేమిమహాద్భుతంబు సే
యునొకో జలేచరప్రభలనున్న పరాత్పరుఁ డేనుఁ దానిఁగ
న్గొనక త్యజింపనీస్థలము కోట్లకునే ననెమౌని మాధవా! 78

మ॥ కడు వైశాల్య మెసంగుచోటను రెనన్ గాఢప్రమోదంబొ? దాఁ
గడఁకన్ ముం దొనరింపఁబోవుపనికిన్ గాఁబట్టియో మీన ము
ప్పుడు గాలిన్ బలిపాఁగోయనఁగఁ బెంపుంబొంది కన్పట్టె ము
బ్బడి ముక్కాలుగ నాయతంబగు తనువ్యాప్తిన్ బ్రభన్ మాధవా!

ఉ॥ ఆయత తాళదీర్ఘమయి యప్పుడ తోఁచెను ముట్టెమీద ము
న్వాయినెసంగు నాయుధమువంటి దృఢంబగుకోఱయొండు మే
లై యిఱువంక వంకకొన నంచితమా విలువంపురీతి నిం
డై యమరెన్ బలప్రథితమౌ పెనువాలము గీవి మాధవా! 80

చ॥ అది తిమియో తిమింగిలమొ ? అట్టిదియిట్టిదినాఁగ శక్యమే ?
యెదిరి తిమింగిలంగిలము లేనియు రావెఱపూని మూలలం
దొదిగెడు దానిధాటి కెదురొడ్డెడుసత్వము కానరాదు ప
న్నిదమున కైన నట్టిపెనునీరధిలోపలనైన మాధవా! 81

చ॥ తెరచిననోటి కట్టిపెనుదీవులు నుంద్రములంత లన్న నా
విరివి యొకింతయర్థమగు వీకున నీరముతోడ నోటిలోఁ
జొరినతిమింగిలంబు లతిచోద్యముగా సెలవుల్ త్యజించి యు
ప్పరమున కేగెడిన్ వెడలఁబాఱెడునీరముతోడ మాధవా! 82

ఉ॥ చెంపలనున్నరంధ్రములఁ జిమ్మఁ బయస్సులతోడ జంతువుల్
ముంపునఁ దీవ్రమహానుసిని బోయి వియత్తలమందు రిక్కలన్
బెంపఱడాగఁగావలయు భీతిలి కానియెడన్ జలంబుపెన్
దుంపురులన్ గనంబడవె తోయముజల్లుగ్రాల మాధవా! 83

ఉ॥ చిమ్మనక్రోవులో యనఁగఁ జెంతలరంధ్రము లుప్పరంబుపైఁ
జిమ్మినవారి తుంపురులఁజిల్లక మింటికిమంటి కాపుకం
బమ్ములపోల్కి లావులప్రభల్ వెలయన్ విలసిల్లుఁగొంతసే
పమ్మెయిఁ బైన వారిదములై యుదకంబుల గ్రాలు మాధవా! 84

ఉ॥ మింటికిఁబాఱునీరములు మేఘపథంబును దాఁటిపోయి యా
వెంట ఘనీభవింపఁ బృథివిన్ బవనాహతి వర్షరూపమై
జంటలుజంటలై పడిన క్షారవిమిశ్రితమీనఖండముల్
పంటపొలంబులై తనరెఁ బత్తుల కవ్వలభూమి మాధవా! 85

ఉ॥ వారి యవారితంబ బటులుపాఱురొదన్ భువనంబుఘూర్ణిలెన్
బోరనమూర్ఛిలెన్ దెలివిపోవుట జీవములెల్ల మేఘసం
చారము మింటఁ దోరమయిసాగెఁ దదుద్గతవాయుసంహతిన్
దీఱునొకో జగంబు లగతిన్ బడి నేఁ డనిపించె మాధవా! 86

ఉ॥ వేడుక వాల మింతఝుళిపించినఁ గొండలవంటిరూపులన్
దోడన వారిఖండములు ద్యోపథచక్రమణంబొనర్చి వే
దాడుల ధారలై కురియుఁ దజ్జలపాతవిశేషతీవ్రతన్
బాడయి లంక లంబునిధిపంకములోఁ గలియంగ మాధవా! 87

ఉ॥ అంబుధిలోమునింగి తనయాటల "హూ" మ్మనుమాత్ర వారి యు
గ్రంబుగఁబొంగి కొండలనఁగాఁ దనమట్టముమీఱిలేచు, నీ
రంబుల నున్న బాడబము రౌద్రత రేఁగినచందమౌచు, నా
యంబుచరంబురోష మెగయన్ మఱియెట్లగునొక్కొ? మాధవా!

ఉ॥ అచ్చట సోమకుండు సలిలాంతరనిర్మితసౌధపాళి సౌ
ఖ్యోచ్చదశన్ జెలంగుచు నయోగ్యతమీఱ విరించియొద్దఁదా
మ్రుచ్చిలికొన్న వేదములు ముచ్చటదీఱఁ బఠింపఁ గౌతుకం
బెచ్చుటఁ దత్క్రియాచరణ మేడ్తెరఁగూర్చవొడంగె మాధవా! 98

శా॥ ఆలో వేగరు లా ర్రిమోఁ దటిసి జోహార్బల్కి దేవా ! యెవం
డేలోకంబున విన్నకన్నయదిగా దీనాఁటివిడ్డూర మా
భీలప్రౌఢిఁ జనించె సప్తజలధుల్ వేగంబ సప్తాద్రులన్
దూలప్రక్రియఁ బెల్లగించు తెఱఁగై త్రోపాడునాన్ మాధవా ! 90

చ॥ జలధులకున్ గులాద్రులకుఁ జాలఁజెలంగెడి యంతరంబు మీ
కలతఁద్యజించి యెద్ది యెటఁగాంచితి రయ్యది యున్నయట్లుఁగాఁ
బలుకుఁ డటన్న సోమకునిబంటులు ప్రాంజలులై మహేంద్ర! యే
పలుకులఁదెల్పఁగాఁగలము వర్తిలు ఘోర మటంచు మాధవా ! 91

ఉ॥ ఆరుదినంబులయ్యె నొకయంబుచరంబు హిమాద్రిమించు వి
స్తారవపుర్విలాసమునుదాల్చి విహారమొనర్పసాగె ము
న్నీరమునందు దూరమున నిల్చి భయంపడి పాఱుఁగాని వా
శ్చారములెట్టివే నెదురఁజాల వటంచనిరప్డు మాధవా ! 92

ఉ॥ "నీలిగి యావులించినను నిక్కముగాఁగఁ గులాద్రులేటికిన్
జాలినయంతనోరు, పెలుచన్ జెనువాలము సంచలించునా
భీలతకున్ వసుంధరయు విశ్వములోనిగ్రహంబు లల్లక
ల్లోలమునొందున ట్లతిబలుండు గ్రమించు" ననంగ మాధవా ! 93

చ॥ తఱిమెడుదానిధాటికి యదాయదలై తగుఁగాదునాఁక పల్
దెఱఁగులఁ బాఱుమీలు జలధిన్విడి మీదికి దూఁకుచుండు నా
తెఱఁ గనలాచలప్రళయదీప్తి ద్రవీకృతభూరిలోహముల్
తఱుచయి రేఁగుభాతి భయదక్రియఁ గన్పడు"నన్న మాధవా ! 94

మ॥ "అదియేచిత్రమొ దైత్యదానవరహస్యావాసముల్ ప్రౌఢిమీ
రుదటిన్మాత్రమె సంచరించునది తద్రోషంబు నోపంగ లే
క దెసల్పట్టిరి పోటుబంట్లయిన రక్షశ్శ్రేష్ఠు లోసామి ! యీ
యుదధిన్నిల్చిన దీపురంబె యిట కెడ్డోవచ్చు"నాన్ మాధవా ! 95

ఉ॥ తొందర లేదు పోండు సయిదోడులఁగూర్పుడు బందుకట్లసం
దందు సమర్థరీతి వివిధాస్త్రసమేతముగాఁగ మేలుసి
బ్బందుల నిల్పుఁ డీపెలను బాకుల లంగరుపట్లు లేటియు
బ్బందియు రానియట్లు పడవల్ సమకూర్పు"డటంచు మాధవా! 96

చ॥ "విసురుడుకోలలుఁ గొఱత్రవేట్లు బరుల్ కొఱముట్లుఁ బన్నియు
న్నసకలయుద్ధనౌకల రణస్థిరతన్ హవణించి సిద్ధమై
యెసఁగుఁడు నేనిదే తగినయేడ్తెర వచ్చెద చూత మెంతఁగాఁ
బసగలదో జలేచరము వైళమపోం"డని పల్కె మాధవా! 97

ఉ॥ ముదలగ్రహించి దానవచమూపతులందఱు ధైర్యసాహసో
న్మదులు ప్రసిద్ధనౌకల నమందగతిన్ దెఱలించి వారిధిన్
బహులుశతంబులై తనరఁ బన్నిరివ్యూహము లంతసోమకుం
డుఁ దఱలివచ్చె వేట యదనుంగని సాగెడికోర్కె మాధవా! 98

శా॥ ఆనాఁ డద్దమరేయి సద్దణిని రాజర్షిప్రధానుండు యో
గానందాబ్ధితరంగడోలికల నుయ్యాలూగుచుండన్ మునీం
ద్రానేకాకలితంబుఁ జోదితమునై యచ్చోటి కేతెంచె హం
సీనృత్యంబుల గొప్పనావ సుతనుశ్రీలొప్పగా మాధవా! 99

వృ॥ ఓడపైకి రావోయి! రాడృషీ!.
నేఁడు వార్ధి హవణించిపొంగెడున్
జూడు మేఘములు చుట్టి మింటిపై
గూడుఁగట్టె ననుకూయి మాధవా! 100

చ॥ చెవులఁబడంగ దానికి విశేషముగాఁ గనిపెట్టియున్న యో
గివరుఁడు కన్నులన్ దెఱిచి కిల్బిషహారుల సర్వయోగిక
ప్రవరుల గౌతమాత్రిముఖభవ్యయతీంద్రులఁ గాంచి మించును
త్సవమున మ్రొక్కి యెక్కె గతసంభ్రమతన్ గలమందుమా॥

గీ॥ ఆరేయి వేఁగునెడ క్షీరాబ్ధిభంగముల హోరంతకంతకును దోరమై
ఘోరానిలంబు లతిచారాప్తిఁ ద్రోపులిడ సారాంబుదంబులిలధారలై
నీరమ్ములన్ గురియ దీరంబుపొర్లఁబడిఁ వారాకరంబెగసి యూరులన్
బూరించెఁ జెట్టులవిదారించె గట్లపయిఁ బేరెంబువాఱెవడి మాధవా

వృ॥ చిమ్మచీఁకటి ఘెళ్ళఘార్భటి జెదరు మెఱుపులు పొదలఁగన్
గ్రమ్మువారిధి కాఱుశీతము గదురయుదుటునఁ జెలఁగుటన్
బమ్మెరన్బడుభూమి కొండలపయిపథములను వదలి నీ
రమ్ముముంచె సమస్తమున్రుచిరము వెఱుగుగతి మాధవా! 103

ఉ॥ కాదన కోహటించుతమకంబునఁ బన్నిన సోమకేంద్రునా
కాదళమెల్ల యుప్పెనఁ జికాకయి యొండొరుఁదాఁకి రాళ్లపై
భేదిలి యాయుధంబులును పీరనికాయముతోడ వార్ధిలో
నేదెఁ బ్రవాతవేగమున నింతయుఁ దిక్కుకయుండ మాధవా! 104

ఉ॥ కోరలుచన్నపాముపలెఁ గొండొకయోజనఁదక్కు సోమ
కుం డారజనీసమానగిపమందు దెసల్గనరామి మాయచేఁ
దోరపువెల్గుఁగూర్పఁ నటదోఁచె మహోర్మపరాజు పోరిఁకన్
దీరదటంచు మత్స్యముగతిన్ దనువూని యతం డుమాధవా! 105

చ॥ కలియఁబడంగ “నోరి! తమకంబున వేదచతుష్టయంబుఁ ము
చ్చిలుటనుకొంటివో బ్రతుకుచింతయెయున్న జితోస్మియంచు నా
తొలిపలుకుంగముల్ వినతితోడుత వేధకొసంగుకానిచో
నిలువుముదిట్టవై యడఁతు నిన్నిపుడంటివి కాదె మాధవా! ॥ 106

చ। మునుపె ప్రచండవాతమున మ్రోతలరేఁగుసముద్ర మింకనుఁ
ఘనపథమంట గెల్పుతమకంబులఁ బోరిననెన్క నానిజీ
వనమును జీవనంబునకు వ్యాసమొనర్చి తదీయగు ప్తవే
దనికరముఁ మునీంద్రులకుఁ దాల్మినొసంగితిగాదె మాధవా॥ 107

మ॥ ఇదిపౌరాణికగాథ మత్స్యమునకానే యిట్లుకావించు టు
త్తద్విదైత్యుల్ దివిజుల్ శఠించుట జలాంతర్గాములౌనావలన్
గదనంబున్ బొనరింప నీవటఁబనిగ్గల్పించుకొంచేగి యు
న్మదదైత్యాంత మొనర్చితంద్రుడు నిజమేమార్గంబొకో మాధవా! 10

# శ్రీ మాధవశతక కదంబము.

## తృతీయోపాయనము.

ప్రతిపద్య ప్రత్యేక రాగగర్భిత చౌషష్టికము.


ల సమృద్ధమై బహుళసేవకసంభరణైకదక్షమై
క్రాలుధరాపురంధ్రి సురకల్పతరుప్రథమించి సాక నా
మేలునఁ దృప్తినొంద కపమృత్యువుఁ గోరినయట్లు పెక్కుచం
దాల శఠింత్రు దుర్జనులు తద్దయుమూర్ఖతఁజిక్కి మాధవా! 1

ఉ॥ హృద్యవసంతకాలమధురీకృతకౌసుమగంధపూర్ణ స
మద్యుతగంధవాహబహుమానితకేకిపికాదిరావగా
ద్గద్యముతోఁప నీ భజనఁ గల్పనఁ జేసెదఁ జిత్తగింపు మీ
పద్య మొకొక్కరాగమున వర్తిలు భక్తిరసంబు మాధవా! 2

ఉ॥ కన్నడఁ జేయుదేల? కడగండ్లనలంపరి తేఱలేక భూ
మి న్నరు లంతకంతకు భ్రమించుచు దుష్కృతు లాచరింపఁగా?
సన్నపుచెట్టె వంగనిది శక్యమె మ్రానగునాఁడువంప? నీ
పున్నెము తేఁపుతేఁపనుచుఁ బ్రొద్దులఁ బుచ్చక గమ్ము మాధవా।

మ॥ సురటీ బ్రాంది యటం చనేకవిధవస్తుద్రావకంబు ల్వసుం
ధరఁ గల్పించితివేల? కామముఖవిన్యాసంబులే మూఢులా
నరుల న్మత్తున ముంచుచుండఁ గనవే నాస్వామి ? గోర్చుట్లుపై
భరమా రోకఁటిపోటు చందమగుచు స్వర్తిల్లెడి న్మాధవా! 4

చ॥ బహుళరుచు ల్వెలార్చునొకపాకపుటుండకుఁ జీమలట్లు నీ
గృహమున నున్నగోళముల గిల్లుచునుంటిమి గ్రాసవాంఛ; స
న్నహానముమీఱి నెంతదినిన స్దఱుగొందనిసత్సమృద్ధిఁ ద
ద్విహారణమిచ్చు నీదయకు విస్మయమయ్యెడు శ్రీరమాధవా!

ఉ॥ అక్రమము ల్హరింప సుజనావళిఁ గావఁ బరాక్రమంబు ని
ర్వక్రకృపార్ద్రదృష్టియును వర్తిల నిందిరఁ గూడి తార్క్ష్యుపైఁ
జక్రము శంఖము న్గదయు శార్ఙ్గముఁ జేతులఁ దాల్చి నాదనా
మక్రియ నెంచఁ దోఁచు పరమప్రభు నిన్నుఁ దలంతు మాధవా! 6

మ॥ త్రిజగన్మోహనమై కృపానిలయమై తేజోదురీక్ష్యంబునై
భజనీయంబయి దుష్టశిక్షణకళాప్రౌఢంబునై సర్వతో
విజయాఢ్యంబయి సర్వశక్తిమయమై వెల్గొందు నీ యాకృతి
న్నిజమౌ భక్తి స్మరింతు లోపముల మన్నింపంగదే మాధవా! 7

శా॥ తోడీవేయని నమ్మి సర్వమును నీతోఁ జెప్పఁగాఁ బూనితి
న్నేఁడీపృథ్వి నిఁకొక్కఁ డెవ్వఁడు మొఱాలింపంగ రక్షింప నా
వాఁడంచు న్ననుఁ గన్నవాఁడనుచు సంబంధంబుఁ గల్పించి ని
న్వేడ న్బాడఁగ నిచ్చకంబనక రావే సత్కృప న్మాధవా! 8

ఉ॥ మాటకుమాటకు న్మధురిమ న్గుఱిపించు త్వదంకితంబులౌ
పాటలఁ దాళము ల్బహుళభంగుల మద్దెలధింధిమిధ్వను
ల్పాటిలఁ జొక్కి మూయుకనుల న్హృదిఁ దోఁచెడు నీవిలాసమౌ
నాటకు రంజిలె న్మన సనంతజగన్నటనాఢ్య! మాధవా! 9

మ॥ కవయ న్మూఁగెడు పైత్యరోగముల కాంతు న్గొల్పు నానందభై
రవి యల్లే మనసెల్లముంచుకొను విభ్రాంతు ల్భవన్నామసం
స్తవమౌన న్గనునంచు నమ్మి దినము న్గావింతు నీపూజల
న్భవదవ్యాజకృపాకటాక్షతతి నింప న్రాఁగదే మాధవా! 10

మ॥ అరచేగుప్తిని ద్రవ్యము న్నిలవసేయ న్లోభులై యొండ్లకీ
యరు తాము న్భుజియింప రంత్యమునఁ దోడై వచ్చునే యీనిధు
ల్ధరఁ దాఁ జేసిన పుణ్యలేశమునఁ గాదా భావిసౌఖ్యంబు చే
కురు! మా నేరమి నోర్చి దిద్దఁగదె వైకుంఠాధిపా! మాధవా! 11

శా॥ కళ్యాణి న్వరలక్ష్మి నాత్మహృదయాగ్రస్థాయిని న్జేసి సా
కల్యశ్రీసుఖసంపదాప్తిని జగత్కళ్యాణము ల్కూర్చువా
త్సల్యం బేమని సన్నుతింతు జగదీశా! భక్తిమచ్చిత్తనై
ర్మల్యంబుం దయసేయుమయ్య కరుణాన్మాకెప్పుడు న్మాధవా! 12

చ॥ మలహారమై విభూతిమయమై ఘనశాశ్వతసౌఖ్యదానవృ
త్తులఁ గడుదక్షమై జగతిఁ దోఁచుభవత్కరుణారసార్ద్రదృ
ష్టులకు జోహారులయ్య! యెపుడు న్నమము నిడయపోలి ప్రోచునీ
లలితతరానురాగబహుళప్రభకు న్నతులిత్తు మాధవా! 13

చ॥ కలఁకలుదేఱుచిత్తమున గాఢతరంబగుభక్తి నుక్తి జో
బ్బిలహరి! పాపనిర్హరణవీర్య! సమస్తసుఖప్రదానకో
మలహృదయాంతరంగ! యని మాటికి గానమొనర్తు నీయశో
విలసనము ల్ప్రపంచబహువీథుల కెక్కిచరింప మాధవా! 14

శా॥ బంధన్యాసివినీవ భాస్కరకరప్రధ్వస్తనీహారమ
ట్లంధత్వంబిడు సర్వబంధముల మాయంజేయుఁ ద్వత్పాదసం
బంధంబౌవరభక్తి, దివ్యనటన న్వర్తించు నీభావస
ద్గంధామోదమెకాదె మాచెఱల రక్షల్కొల్పుట ల్మాధవా! 15

శా॥ 'ఆపద్బాంధవ! సంశ్రితావనదయావ్యాపార!' యం చెందరో
భూపాలాగ్రణులే వినమ్రులగుచు న్బూజింత్రు నిన్నెప్పు డా
శాపానుగ్రహదక్షులైన మునులున్నాసమోక్తి నిన్నెంతు; రా
శాపాశోపహతస్వభావులరు హెచ్చా! మాదృశు ల్మాధవా! 16

చ॥ గజముల మధ్యమావతికిఁ గష్టముకల్గునె? లెక్కకెన్నఁడా
ప్రజలమటంచు రా భయమువాటెనె నీహృదయంబునందు? వె
న్నుఁజఱచి యెట్టివారల ననుగ్రహదృష్టి భయంబుఁదీర్చునీ
కు జడుప! నమ్మఁజాలఁ గనుఁగోదయసేయఁగదయ్య! మాధవా

ఉ॥ ప్రౌఢవరాళి ఫుల్లమకరందసమన్వితపంకజంబుల
న్గాఢతరాభిలాష నెమకన్జనువైఖరి భక్తిగంధసం
రూఢశ్రితాంతరంగజలరుట్తతిఁ బర్వులువాఱు దీవట
న్బాఢమనీషు లెన్నుకొనువార్తల నమ్మి నుతింతు మాధవా! 18

శా॥ కాలం బేగడపంగఁజాలుదునె నీకారుణ్యమే లేనిచో
నీలీల న్సుఖవృద్ధి సంతతముదంచీయంగ? నోయయ్య! నీ
జాలప్రాభవమో? మదీయజడతాసంప్రాప్తమో లౌక్య వా
ర్తాలగ్నంబగుబుద్ధిచే మఱతు నీతత్త్వంబు నోమాధవా! 19

ఉ॥ రోయకమాఱు గుప్పలకుఁ గ్రోధములన్నినియంగఁబోక స
త్త్యాయతమా కృపాగరిమ నారయుచుండెదు చంటిబిడ్డపై
మాయికిఁ గల్గుప్రేమ పయిమాటసుమీ భవదీయప్రేమ! నీ
కేయొక మాఱుసేఁత రచియింపఁగలేముగదయ్య! మాధవా! 20

చ॥ మునుకొని శంకరాభరణముల్కడుఁబూన్కినొనర్చి గుష్టవ
ర్తనులనడంచి లోకముహితంబొనఁగూర్చెద వెంతప్రేమయో
మనమున నీకుమాపయి! శ్రమంబొకటెంచవు చక్కనయ్య! ని
న్ననుకొననైనఁ జాల మహహా! కృతివిస్మరణంబు మాధవా! 21

మ॥ కనకాంభోజముల న్మణులొప్పిదివి శృంగారంబురంగారఁ జె
క్కినహారంబు మనంబునన్దలఁచి యాత్రేకవ న్నిను న్మానసా
క్షినిరీక్షించి శరీరమందుఁ బులకల్చెన్నొందె యోగ్యంబటం
చును నీకంఠమలంకరింతుఁ గళతేజుల్పొల్వ నోమాధవా! 22

శా॥ పాలన్ద్రావెదొ! పాదమున్దెనదవో! పన్నుండెదో! యాటల
న్నేలంబోయెదొ మల్లరంగములకున్దేకించెదో! బిడ్డల
న్నాలింతో! మగలీలలన్మనఁగదో! నాతండ్రి! లోకంబన
న్నేళీరంగమనీకుఁ బాలువలభు ల్నికీరితు ల్మాధవా! 23

ఉ॥ సారవిహీనసంసరణసాగరసన్నుతి శక్తిమాయ సా
వేరికినైన మోక్షమగు టెంతయు నిక్కము; మెత్తుబడ్డపు
ట్లోరగిలంగఁ దక్కినవి యూఱక ముక్కలఁగాళ్ళఁదన్ని చే
కూరుచు నారకప్రబలఘోరపరంపరలెల్ల మాధవా! 24

ఉ॥ వేకువయందుఁ బ్రాహ్ణమున వీలగుచుం గుతుపంబులందు నెం
దాఁకలిఁదీర్చు హోయినిడిదాహమడంచెదు తావకీనసు
శ్లోకమునాకు, కాఫిఁగొని లోకము మించుచలాకినొందు న
ట్లోకమలాపతీ! హృది మహోత్సుకతన్వెలయింపు మాధవా! 25

ఉ॥ లోకముఖారిరంసువులలోఁ గడునిట్టవుగాంగఁదోఁచు ని
వీకడలేనిసృష్టి నెసఁగించుచునుండుట; నింతచాలెగా
కేకళలబ్బు సంతతుల? కింతటనంతటునైనఁ దృష్టి నీ
కే కనుపట్టుచున్న నిఁక నెవ్వతె నేమనవచ్చు? మాధవా! 26

శా॥ ఆభోగీంద్రముపైనవ్రాలి గళమం దంసంబున న్మోన నే
శోభాపాదక మొక్కొ వానినె తమిన్జుట్టించుకొన్నాఁడ వా
లాభాలాభవివేక మేమెఱుఁగ మోలావణ్యసీమా! శ్రితు
ల్లాభీతిల్లుటకొక్కొ? సోదరులకు న్నాఱాపులే? మాధవా! 27

ఉ॥ ఆశ్రితచక్రవాకహృదయజ్ఞ! మనోహర భానురూప! నీ
యాశ్రమముల్గదా దివి ననంతమమేయమునైన సంఖ్యతోఁ
బ్రశ్రితరూఢిఁ దేలెడి ప్రపంచము? లన్నిఁటి నిట్లుసాక నీ
కేశ్రమసోఁకదే? కిటుక దేమి వచింపవెమాకు మాధవా! 28

ఉ॥ అధ్వగులై త్వదాశ్రితు లహర్నిశలు న్నినుఁబాడిపాడి హం
సధ్వని నాలకింపఁ గడుమక్కువ యోగసమాధిఁబూని రో
యధ్వరరూప! మానసమునందయిన న్వెలయింపవయ్య! యా
సాధ్వభిలాషతీఱ సరసంబగువాగమృతంబు మాధవా! 29

ఉ॥ నీదర్బారున మంత్రులెవ్వరో? ప్రధానిత్వంబునం దెవ్వరో?
జోదు లైన్యపతు ల్పటాలములును న్సారాళి యెవ్వారలో
యేదిక్కీమనో నీసురచ్ఛ? విషయం బేదో మహాచర్చకు
న్మాదైన్యంబునడంప నెవ్వరినిబంపంబూనెదో? మాధవా? 30

చ॥ నిరతము లోకసంభరణనిష్ఠల లోలతనుండునీవు ని
ష్ఠురతపమూనుమానవులఁ జూచిన సిగ్గిలుదేమి? కానిచో
గురుతరవిఘ్నము ల్మొదటఁ గొల్పఁగ నేటికి? చేతఁగాక వి
న్నబఱగున లొంగనేలతుది? పాశహనామ! వదాన్య! మాధవా! 31

ఉ॥ చేకొనియారభించినది చేయక మూలల ముక్కుమూసి యే
లాకొఱమాలఁ? గార్యఫలమం దభిలాషఁ ద్యజించి మీవిధం
గైకొన మేలటంచుఁ దొలిఁ గల్పనఁజేసెదెవిఘ్న? మాగక
ల్లై కడుదీఱనిల్చినఁ గడిందిదయ న్వరమిత్తె? మాధవా!॥ 32

ఉ॥ రాగమె ముక్తిదారి జనరంజని నికలరూపుఁజూపువి
ద్యాగతి, సర్వసౌఖ్యపరమావధి, యెట్లన? గానవిద్యలో
రాగము, లోకవృత్తినను రాగమెగాక సరాగ మైహికా
ముష్మికభోగముల న్సరాగ మభియోగపరాగముభక్తి మాధవా! 33

శా॥ దేశాక్షీణజనానురాగముల నెందే మక్కువన్జిక్కి స
ర్వేశా! నాస్థితి విస్మరించెదవొ? తండ్రీ! నీవె యిట్లేమఱ
న్నాశాబద్ధుఁడనైననాకు లభియింపంబోవునే ముక్తి నా
యాశాంకూరము వృద్ధినొంది ఫలమీయన్నాగునే! మాధవా! 34

ఉ॥పున్నాగంబుల దండలల్లుకొని నిన్బూజింతునో? కేళిమై
పున్నాగంబుల నిన్నునిల్పి దెసలంబోనిచ్చి యాడింతునో?
పున్నాగోరుదళాక్ష! యంచు దినముం బూజించి కీర్తింతునో?
పున్నాగప్రభువర్య! నీకయినయింపు న్దెల్పవే! మాధవా!॥ 35

శా॥ చేరంబాఱి "ప్రసీదమే భువనవాసీ! సత్కృపారాశి!" య
న్వారి న్ఘోరములెల్లఁబాపి కరుణ న్బాలింతువో దేవగాం
ధారేయు ల్సమకూర్చు కష్టముల కంతంబు న్ప్రసాదించి యీ
వే రాజ్యంబు సుఖంబుఁ బాండవుల కోయీ? పూర్వమో మాధవా!

ఉ॥ ఝుంకారధ్వనితోడ బంభరము లబ్జస్వాదుమద్యంబు నా
తంకంబు ల్గొన కారగించుక్రియ స్వాతంత్ర్యంబు నిండార స
యోంకారధ్వనితోడవచ్చి శ్రితభక్త్యుత్ఫుల్లచిత్తాబ్జపీ
రాంకస్వైరవిహార మూనఁగదె స్వాస్థ్యప్రశాంతితో మాధవా! 37

శా॥ ఆ సావేరిడియంగఁబోక సెలలేయన్నాగు హృద్భూభిని న
న్నోనసారు ల్మొదలంటఁబోయెనని యేనూహించిన న్జిక్కకే
మోసుల్వాఱుచు జేకులెత్తుకొని యుబ్బున్జూపుఁ దండ్రీ! తదా
యాసం బెట్టుకథావశేషమగునయ్యా! తెల్పుమో మాధవా! 38

శా॥ శాతఘ్నిస్వన మిచ్చగించెదవొ? ఝుంఝూటీధ్వని న్మెత్తువో
కొక్కో? తీర్థాధిపుహోరుఁ గోరుకొను దొక్కో? విశ్వరూపంబుచే
నేత్రద్రోదసినిండునీకుఁ దగులానే భృంగరాణ్ముఖ్య సం
జాతోక్తు ల్వినుఁదేర్పఁజాలుస్వరవిస్తారం బెదో? మాధవా! 39

ఉ॥ గాళిక భావిసూచనను గల్పనఁజేసితి మానవుండు నీ
పాళిమునందు మేటియగువాఁ డయిన తృణమందు వచ్చు నే
ష్ఠాళెముఁ బోల్పలేఁ డిదియె పో భవదుజ్జ్వలసృష్టిరీతి, యే
తాళము ఘొట్టిరాగమొ? ప్రతారణముల్తగునయ్య! మాధవా। 40

శా॥ ఔదార్యంబున కున్కిపట్టయిననీహార్యత్నుపత్నుంబున
న్జేదోడై చు వసించుమాజనని శ్రీసింహాద్రిమధ్యాదయా
ప్రాదుర్భూతవిశేషసంపదలు భూభాగంబుల న్నిండుటం
గాదే మాకుఁ గొఱంతలేని సుఖము ల్కామప్రదా! మాధవా! 41

శా॥ ఆవాచస్పతికైన నీబహుళమాయాసర్గము ల్తేటగా
భావింప న్వచియింపలేఁడనినఁ దత్ప్రస్తావము ల్మాకెట? సృ
ష్టివైచిత్ర్యములం దనంతకళల న్శృంగారముల్చిల్క నీ
వీవు ల్కాంచి ముదంబుపెల్లెగయుతుష్టి న్గాల్చెద న్మాధవా! 42

చ॥ భవదభిమాన మిం దమృతవాహినిగాఁ బ్రవహింపఁగాదె మా
నవహృదయావివేకకలనాజనితాఖిలచిత్తఘాతము
ల్పవరణఁజెంది నూత్నజవసత్వముల న్వికసించుచుండు ను
త్సవములఁ దద్భవంబులు విశాలదయాహృదయాఢ్య! మాధవా !

చ॥ అన యిటు లంత మిం దనుటకందక పాఱెడుకాల తీవ్రవా
హిని నడిసీమ నీకు క్షణమేనియుఁగాని యొకింతలోనె పు
ట్టి నెగడి తీఱువారలు కడిందిముదంబిడుసృష్టిఁ దుష్టిమైఁ
దనియక దాని మాయయనితారుట దుర్గతిగాదె మాధవా! 44

చ॥ అమృతతరంగిణు ల్భవదపాంగముల న్జనియించి స్వప్రవా
హముల ననంతలోకనిచయంబులపైఁ బరగించి నేత్రప
ర్వములుగ సర్వసౌఖ్యపరిపక్వదశాఢ్యులఁగా నొనర్చు నా
ర! మిగులు దీనికంటె నితరంబులఁగల్గునె మాకు మాధవా! 45

ఉ॥ పుట్టుటదేనికో? తఱలిపోవుటదేనికొ? తత్ప్రసంగము
ల్పట్టవుమాకు నిత్యసుఖవర్ధక సృష్టికళావిచిత్రము
ల్గట్టిముదంబుఁగూర్చి తమకంబుల తేఁపుచునుండఁ జిన్మయి
న్నట్టువఁజూపునీప్రకృతిన ర్తన మేల్తగుతోట మాధవా! 46

మ॥ ఇవసంఛాదన దీర్ఘరాత్రివశమై యెన్నాళ్ళకెన్నాళ్ళకో
రవితోఁపస్గలదేశమధ్యమునఁ దదృవ్యత్వము న్జూడకే
రవిలోమచ్చల దుర్భిణిన్బఱపి పాఱజ్జూచువాఁడట్టు లు
త్సవకృత్సృష్టిని వీడి భోగి పరచింతన్ముక్కునే? మాధవా! 47

మ॥ బహుపంథల్కలవండు) నిన్నుఁగలియ న్భావింప నా కొక్కటే
స్పృహఁగన్పట్టు ననన్యమైన హృదయోద్వేగంబు తత్ప్రాప్తి ని
స్పృహనో! భక్తినొ! వైరవృత్తినొ! మఱింకేద్దానొ నైనసే
మి? హృషీకేశ! సమస్తభావవిపులోర్మిడోలితా! మాధవా! 48

మ॥ పులుగుల్పేయుకలస్వనంబులకు నంభోరాశిసంభూత సం
కులకోలాహలనిస్వనంబుల కనుంగుంబిడ్డల ద్గోంచు ని
ర్మలినావ్యక్తకళాకలాపములకు న్మందానిలప్రాప్తకో
మలరావంబుల కన్యము ల్సుఖసమాంశ న్నిండునే? మాధవా! 49

మ॥ కలహంసేంద్రియసౌఖ్య మీఁగలుగు నీకమ్రత్వసంపూర్ణస్పృ
ష్టుల నానందముఁగూర్చు నాయవయవస్తోమంబు లున్నప్డె త
త్కళఁగైకో కదినశ్యమంచుఁ దెలియంగారాని దేనొతునే?
కలదే? మబ్బులనమ్మి కూపముఁ గడంకన్బాడ్చుట? ల్మాధవా! 50

శా। నాప్రాణానకు నీప్రపంచము మహానందంబు నీఁజాలు స
త్యప్రేమాఢ్యముగాఁ జెలంగెడి తదీయానుస్వరూపంబులఁ
న్నిప్రౌఢత్వము నీమనోజ్ఞగతియు న్నీరూపు బింబింప మా
యాప్రాప్తంబని యీసడించు టెటులయ్యా! శ్యామలా! మాధవా!

ఉ॥ ఒక్కటఁగాకయున్న మఱియొక్కటనైనను నీవు మెచ్చు స
మ్యక్కృతి సల్ప హస్తముఖరావయవంబు లెసంగునప్డె కా
కక్కట! 'సర్వమిథ్య' పఠమాని గతించినవెక్క యాతసం
జిక్కిన నానె? యిప్డె కృషిఁజేసెద భక్తిఁ ద్రిమూర్తి! మాధవా!52

చ॥ కరములు సాధుసోదరనికాయసుఖాస్పదకార్యసాధనో
త్కరములుగాక కేవలభవద్భజనాంగకతాళఘట్టనా
చరణపరంబులేయయిన సాకృతి సృష్టినెసంగు నీపదాం
బురుహముపూర్ణపూజఁ గనఁబోలునె? మంజులపాద! మాధవా!53

చ॥ చరణము లార్తపాంథజనసద్మతలాభిగతి స్తరింప కు
ర్వర భజనాంగనాట్యముఖరంబులఁ జిందులఁద్రొక్క సాకృతి
న్ధర నిరవొందు నీగుదుపదంబును బూర్తిగఁ బూజసేయు తు
ష్టి రహిఁజన్నించునే? లలితసింధుసముద్భవపాద! మాధవా! 54

ఉ॥ నాస విరోధిషట్కపథనప్రతతి న్బసిపట్టి యజ్ఞతాఁ
హాసునిబద్ధమూఢజన మోహపరిచ్యుతిఁ గూర్చ కూఱకే
కాసునుగాని వాసనలకై భజనక్షితి ధూపదీప వి
న్యాసమొనర్చ సారమతినబ్బునె పూర్ణఫలంబు మాధవా! 55

ఉ॥ కన్గవ దుర్విలాసములఁగాంచి భ్రమించి విపత్పయోనిధి
న్మున్గెడువారిపైఁ బఱపి ముప్పిడలించురహార్తిఁ దేటమా
ఘన్గుసఁజెప్పకే భజనదిక్పటబద్ధత్వదీయరూపముం
గన్గొనుచుండ నీకొలు వఖండితపావనియౌనె? మాధవా! 56

ఉ॥ శ్రోత్రము లర్ధదేహగుణశోభఁ జెలంగనివారి మూలుగే
మాత్రమెసంగిన న్వని శ్రమంబని తొల్గక తద్వముక్తికై
సూత్రముఁజూడకే భజనఁ జొప్పడునాదము లానుచున్న స
త్పాత్రిత నిండెఁ? మోక్షవరవర్ధనియేపథిఁ జేర! మాధవా! 57

ఉ॥ యోజనము ల్త్వదంగలలితోజ్జ్వల లక్షణఁ బ్రాతినిధ్యత
న్రాజిలు సృష్టిభేదముల రక్షణపై వెలయించి సృష్టి క
వ్యాజతఁ దోఁచునీమసకలాంగకపూజ నొనర్పఁబోక నీ
రాజనము న్ప్రసాదమును రాఁ దమకించుచు భక్తమండలి
న్దేజునఁ గూరుచుండఁ గలదే చిరసౌఖ్యమునాట? మాధవా! 58

చ॥ దొసగులఁదోలుసూత్రమును దోడులతో వచియింప కెప్పుడు
ప్రసన సురాగభక్తి పరిరంభితగీతముఁబాడ సత్సుధా
రసకరకాయితంబయి ధరన్దగు నీచరణాంబుజంబు మే
ల్పసగలవృష్టి నిచ్చునె తపస్వినియై చనుగాఁక మాధవా! 59

మ॥ భవదిచ్ఛాలవజాతపాలితదయాంభఃపూర మాపూర్తి ను
త్సవకృద్భవ్యతరామృతద్రవ మహాసారంబుగా సర్వభూ
త విలాసంబుల సృష్టిపై వెలసి యత్యంతోరుసౌఖ్యంబిడ
ప్లవమాత్రంబును లేమియుండునె మహానందస్థితి న్మాధవా! 60

శా॥ ఆపాదంబు దయారసంబయగు నీయం దూరుదాక్షిణ్య స
త్కూపారంబు సమస్తలోకములపైఁ గుల్యల్లనదు లావర్ధులై
త్రోపాడ న్శమియింపరాని యఘము ల్దోషంబులుం గల్గునే
శాపంబు ల్వడిడిందవే నిగమసంచారీ! హరీ! మాధవా। 61

మ॥ కనకాంగీన రుచివిశేషములు సంగప్రాప్త నీలాంబుదా
యువతేజంబును జంద్రసూర్యకృత నేత్రాలోకము ల్వ్యక్తమం
దున శ్రీవత్సకళాకలాపములు నెంతోదీప్తి లోకంబులం
దు నవశ్రీయుతరత్నకాంతులను సంతోషంబిడు న్మాధవా! 62

ఉ॥ రాగములన్నియు న్సురుచిరంబులు లక్షలుఁగోట్లు దేవభూ
రాగవిశేషకల్పిత నిరంజనరంజకము ల్సుధార సో
ద్యోగకళాన్వితంబు లెలతోషకము ల్వచియింపనౌనె? యా
యీగతి మేళకట్టులవచించితి నాకుతి తీఱ మాధవా! 63

ఉ॥ ప్రస్తరితస్వరప్రచయభాసితనారదగానరీతి యో
శస్తగభీరరాగబహుచాలితతుంబురమూర్ఛనాళి యో
నిస్తులితస్వభావపరిణీతశుభోభయసాహితీకళా
ప్రస్తుతి యో! తృణంబిదికృపన్గొనుమేరువుగాఁగ మాధవా! 64

---

తెనాలి శారదా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె. [illegible]

# తప్పొప్పుల పట్టి.

| పేజి. | పంక్తి | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 7 | నాడెదవాకే | నాడెదొాకటే |
| | 14 | సంస్కృతీ | సంస్కృతిఁ |
| 7 | 25 | ఱెండ | రెండ |
| 9 | 25 | మున్నగునె | మేలయగు |
| 10 | 21 | ఉవిదాం | యువతీ |
| | 26 | గాఢే | కొాల్వే |
| 11 | 1 | తేనియు | తేనిను |
| 12 | 7 | తోఁటి | తోఁడి |
| | 8 | తరయు | తరము |
| | 19 | ణాముజి | ణామునఁ |
| 15 | 8 | యశశ్వ | యశస్వి |
| 17 | 19 | స్వాంత | స్వచ్ఛ |
| 18 | 18 | సుషిమా | సుషమా |
| 19 | 23 | ప్రళ | విల |
| | 25 | కఱఁగు | కరఁగు |
| 20 | 16 | తీఱే | తీరే |
| 21 | 17 | జక్కెఱ | జక్కెర |
| 23 | 8 | కొారకు | కొాఱకు |
| 25 | 1 | ట్టులగాక | ట్టులుగాక |
| | 18 | రానూ | రానుఁ |

| పేజి. | పంక్తి | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 28 | 11 | హృణ్ముఖః | హృన్ముఖః |
| 29 | 22 | త్రరి | త్రటి |
| 30 | 16 | వేగే | వేత్రే |
| 31 | 3 | గారు | గాలు |
| | 17 | ఆగసముఁ | ఆకసమునఁ |
| 33 | 3 | న్యాస | న్వ్యాస |
| 42 | 5 | గారా | గరా |
| | 20 | నటులఁ | నటుతే |
| 44 | 15 | ప్రోగ్రో | ప్రాగ్రో |
| 52 | 19 | ట్గో | ల్గో |
| 54 | 26 | డయిన | డయినఁ |
| 55 | 6 | సృష్టి | యిాని |
| | 25 | ఇవసంఛాదన | ఇవముల్కప్పుట |
| 56 | 4 | లోర్క్మిడోలి | లోర్మిత్రాళి |
| 57 | 12 | యోపధి | పటాకళ |
| 58 | 7 | తెల | లతి |

